

# శ్రీ శోభ కృత్ ఉగాది 2023

# 19.03.2023 జరిగిన

## కవితా సంకలనం






MARCH 19, 2023
సరసభారతి ఉయ్యూరు




# శ్రీ శోభ కృత్ ఉగాది 2023 కవితా సంకలనం

# Table of Contents

# అపూర్వ విషయం



సాహితీ బంధువులకు శ్రీ శోభక్రుత్ ఉగాది శుభాకాంక్షలు. సరసభారతి బ్లాగ్ ఏర్పరచి దశాబ్ద కాలం దాటింది. అంతకు ముందు,ఈ కాలం లోనూ నేను రాసిన రచనలన్నీ ఒక చోటుకు చేర్చాలని మా రెండవ అబ్బాయి శర్మ తపన పడుతూ, వాడి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ ఈ పనికి సుమారు ఆరునెలలముందు శ్రీకారం చుట్టాడు. ఎప్పటికప్పుడు నాకు పురోగతి తెలియజేస్తూ, గొప్ప విజన్ తో ముందుకు సాగుతూ మొట్టమొదటి సారిగా నారచనలు డిజిటల్ గా మార్చి, "సమస్త భక్త శిఖామణులు " శీర్షిక తో సుమారు 700 పేజీల దేశ భక్తులు, దైవభక్తులు, రాజ్యభక్తులైన మంత్రులు మొదలైన వారి గురించి నేను రాసినవన్నీ క్రోడీకరించి 75వ భారత స్వాతంత్ర్య దినోత్సవ పుణ్య సమయం లో ఆన్ లైన్ లో నాతో అవిష్కరింప జేశాడు. వాడి దీక్షకు కృషికి విజన్ కు అభినందనలు. ఎదో రాసుకొంటూ పోవటమేకానీ, దానికింత ప్రశస్తి ఉంటుందని నాకెన్నడూ అని పించలేదు. ఇదంతా చూశాక, తప్పులు దిద్దే సమయం లో కొన్ని అసలు నేనే రాశానా అనే అనుమానం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా వాడిని అడిగితె "నువ్వే రాశావు నాన్నా "అని జ్ఞాపకం చేశాడు. ఇది నా సాహిత్యజీవితం లో ఒక మైలు రాయి.

ఇంతటి తో ఆగలేదు. నేను వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ రూపంగా రాసినవన్నీ ఒక చోటికి చేర్చి డిజిటల్ రూపమిచ్చి రెండవ భాగం గా సుమారు 450 పేజీల "వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ"గా నామకరణం చేసి విద్యా ప్రదాత శ్రీ వినాయకుని పుట్టినరోజు శ్రీ వినాయక చవితి నాడు నాచేత ఆవిష్కరింప జేస్తున్నందుకు మహదానందంగా ఉంది. ఎన్ని సార్లు తప్పుల జల్లెడ పట్టినా, కొన్ని కంటికి కనిపించకుండా దూసుకు పోతూనే ఉన్నాయి. థ,ఠ,ఢ వంటి అక్షరాలు స్పష్టంగా రాయటానికి జంత్రిక ను నాకు ఎప్పటికప్పుడు అందించి, వేగ వంతంగా రాయటానికి తోడ్పడుతున్న మా మనవడు చి. భువన్ కు ఆశీరభినందనలు. ఇంతటి అక్షర వారాసి ని చూస్తుంటే అద్భుతమని పిస్తోంది. ఇంకా కొన్ని భాగాలు వీలువెంట డిజిటలైజ్ చేసి, వేర్వేరు శీర్షికలతో ఆవిష్కరిస్తాము. ఇదంతా మా తలిదండ్రుల ఆశీర్వాదాలు, మా ఇలవేల్పు శ్రీ సువర్చలాన్జనేయస్వామి దీవెనలు, శ్రీ సరస్వతీ మాత కరుణా కటాక్షమే అని సవినయంగా మనవి చేస్తూ, మా శ్రీమతి, మాకుటుంబ సభ్యులు అందిస్తున్న ప్రోత్సాహానికి, సాహితీ బంధుల ఆదరాభిమానాలకు అభినందనలు తెలియ జేస్తున్నాను. ఇప్పడు శోభక్రుత్ హనుమాన జన్మ దినం సందర్భం గా సరసభారతి ఉయ్యూరు నిర్వహించిన శోభక్రుత్ ఉగాది 2023 వేడుకల సంకలనం డిజటల్ పుస్తకం గా రావడం మరొక మైలురాయి.

గబ్బిట దుర్గాప్రసాద్ 14 .05 .2023

ఉయ్యూరు

## ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యురు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంథాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్ నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫొటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా... సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక్ గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దోర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార ద్రుష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలనేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది.ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. దాదాపు 1000 గంటల లైవ్ చేసి వాటిని youtube లో అప్లోడ్ చెయ్యడం జరిగింది. సరసభారతి బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40. అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి **అంకాత్మక** (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

శోభక్రుత్ హనుమాన్ జన్మదిన కానుకగా అందిస్తున్న మరొక అంకాత్మక (డిజిటల్) పుస్తకం. శ్రీ శోభ కృత్ ఉగాది 2023 19.03.2023 జరిగినకవువు రాసిన కవితా సంకలనం

## గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు : | గబ్బిట దుర్గాప్రసాద్ |
| జననం | 27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా |
| తలిదండ్రులు | గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి |
| భార్య | ప్రభావతి |
| విద్య | ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్. |
| ఉద్యోగం | ఫిజకల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998) |
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంద్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనపేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంధ్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరఫున |

| | |
|---|---|
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు 2. వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ 3. కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు,4. దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు,5. బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీగబ్బిట మృత్యుంజయ శాస్త్రి,6. శమీ అష్టోత్తరం పూజా విధానమ, 7. సహస్రచంద్రదర్శనం 8. శ్రీ సంకర 9. . శ్రీ శోభ కృత్ ఉగాది కవితా సంకలనం |

# ఆహ్వాన పత్రిక

వీడియో : https://youtu.be/AyVo8h3eUPA

## ఉయ్యూరులో వైభవంగా సరస భారతి ఉగాది వేడుకలు

ప్రపంచానికి ఆదర్శంగా తెలుగు వారికి గర్వకారణంగా నిలిచిన మన సాహితీ - కళ సంపదను నేటి తరం సంరక్షించి భవిష్యత్ తరాలకు అందించాలని ఆంధ్రప్రదేశ్ మాజీ ఉపసభాపతి మండలి బుద్ధ ప్రసాద్ అన్నారు. ఉయ్యూరు లోని శ్రీమతి నాగళ్ళ రాజేశ్వరమ్మ జానకిరామయ్య విజ్ఞాన కేంద్రంలో ఆదివారం రాత్రి సరస భారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో శోభకృత్ ఉగాది వేడుకలను ఘనంగా నిర్వహించారు.ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా రాష్ట్ర మాజీ ఉపసభాపతి మండలి బుద్ధ ప్రసాద్ హాజరయ్యారు. సరసభారతి వ్యవస్థాపక అధ్యక్షులు గబ్బిట దుర్గాప్రసాద్ అధ్యక్షతన జరిగిన ఈ ఉగాది వేడుకలలో కవి సమ్మేళనం తో పాటు వివిధ రంగాలలోని విశిష్ట వ్యక్తులకు ప్రత్యేక పురస్కారాలను ప్రధానం చేశారు. భారతదేశంలో హరికథకు తొలి పద్మశ్రీ అవార్డు పొందిన హరికథ గాన కళాపీఠం వ్యవస్థాపకులు హరికథ సామ్రాజ్య సార్వభౌమ పద్మశ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి భాగవతార్ తో పాటు ప్రముఖ సినీ నటులు ప్రయోగాత్మక రంగస్థల నటులు బుల్లితెర దర్శకులు తెలుగు చలనచిత్ర నంది అవార్డులు గ్రహీత ఎస్.కె.మిస్రో లకు సరస భారతి తరపున కీ.శే.శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి భవానమ్మ దంపతుల స్మారక ఉగాది పురస్కారాలను ఈ వేదికపై అందజేశారు. వారితో పాటు సాహిత్య, కళా రంగాలలో విశేష సేవలు అందించిన పలువురు వ్యక్తులకు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, శ్రీమతి ప్రభావతి దంపతులు శోభకృత్ ఉగాది పురస్కారాలను ప్రధానం చేశారు. అనర్గళ పద్య గానం తో ప్రఖ్యాతిచెంది,మెమరీ పవర్ తో 5 ప్రపంచ రికార్డులను బద్దలుకొట్టిన మున్నంగి హాసిని శ్రీరూప ని ఈ వేదికపై సత్కరించారు. సరసభారతి వేడుకలకు రెండు తెలుగు రాష్ట్రాల నుండి పలువురు రచయితలు,కవులు హాజరై కవి సమ్మేళనంలో తమ కవితా మాధుర్యాన్ని పంచారు. కార్యక్రమంలో ఆత్మీయ అతిథులుగా కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావు , ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి చలపాక ప్రకాష్ హాజరయ్యారు. కార్యక్రమంలో సరస భారతి గౌరవాధ్యక్షులు జె. శ్యామల దేవి ,సాహిత్య సాంస్కృతిక రంగాలకు చెందిన ముఖ్యులు పాల్గొన్నారు. తెలుగు రచయితలు,కవులు, సాహితీ ప్రియులు పాల్గొన్నారు. కార్యక్రమాన్ని సరస భారతి కార్యదర్శి మాదిరాజు శివలక్ష్మి , సరస భారతి కోశాధికారి గబ్బిట వెంకటరమణ పర్యవేక్షించారు.

## ఉదయం ఆలయం లో శ్రీ మిశ్రో దంపతులు







ఇంటి లో శ్రీ మిశ్రో దంపతులకు  ఆతిద్యం









## సభాకార్యక్రమాల ప్రత్యక్ష ప్రసారం



https://youtu.be/GEnAUbjPEsQ

సరసభారతి –సాహిత్య సాంస్కృతిక సంస్థ –ఉయ్యూరు

# శ్రీకోట భాగవతార్ ,శ్రీ మిశ్రో గార్ల సన్మాన పత్రాలు

1- హరికథా సామ్రాజ్య సార్వ భౌమ పద్మశ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి భాగవతార్ గారికి సరసభారతి అందిస్తున్న జీవిత సాఫల్య పురస్కారం .

హరికథా సామ్రాజ్య సార్వ భౌమ పద్మశ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి గారు శ్రీ కోట వెంకట శివయ్య ,శ్రీమతి సుబ్బమ్మ దంపతులకు 1934 లో ప్రకాశం జిల్లా అడ్డంకి గ్రామం లో జన్మించారు .చిన్నతనంలోనే తండ్రి మరణించటం వలన పెద్ద కుమారుడిగా కుటుంబ బాధ్యత వహించారు .అప్పుడే హరికథాగానం ప్రారంభించారు .విరిగురువు గాన గాంధర్వ'' బాలు''గారి తండ్రి శ్రీ పండితారాధ్యుల సాంబ మూర్తిగారు .ఆలస్యంగా అభ్యసించటం వలన గుర్తింపు కూడా ఆలస్యంగానే వచ్చింది .తర్వాత శ్రీ ముసునూరి సూర్యనారాయణ దాసు గారి వద్ద మహాభారత స్క్రిప్ట్ రాయటం నేర్చుకొన్నారు .

రామాయణ ,మహా భారత కథలను హరికథా గానం చేస్తూ ఇప్పటికి 1500కు పైగా దేశ ,విదేశాలలో ప్రదర్శనలిస్తూ భారతీయ సంప్రదాయాన్ని ప్రచారం చేశారు .భాగవతం ,భగవద్భక్తులు.జగద్గురు బోధలు, జాతీయ నాయకుల పై కథాగానం చేసి భక్తి తోబాటు జాతీయ సమైక్యత,భారతీయ, తెలుగు సంస్కృతి సంప్రదాయాలను ప్రచారం చేశారు .

"అక్షరం లోక రక్షకం"

సరసభారతి

సాహిత్య సాంస్కృతిక సంస్థ - ఉయ్యూరు

శ్రీశోభకృత్ ఉగాది వేడుకలు

172 వ కార్యక్రమం

సన్మాన పత్రం

1 హరికథా సామ్రాజ్య సార్వ భౌమ పద్మశ్రీ కోట సచ్చిదానందశాస్త్రి భాగవతార్ గారికి సరసభారతి అందిస్తున్న జీవిత సాఫల్య పురస్కారం.

హరికథా సామ్రాజ్య సార్వ భౌమ పద్మశ్రీ కోట సచ్చిదానందశాస్త్రి గారు శ్రీ కోట వెంకట శివయ్య, శ్రీమతి సుబ్బమ్మ దంపతులకు 1934లో ప్రకాశం జిల్లా, అద్దంకి గ్రామంలో జన్మించారు. చిన్నతనంలోనే తండ్రి మరణించటం వలన పెద్దకుమారుడిగా కుటుంబ బాధ్యత వహించారు. అప్పుడే హరికథాగానం ప్రారంభించారు. వీరి గురువు గాన గాంధర్వ "బాలు" గారి తండ్రి శ్రీ పండితారాధ్యుల సాంబమూర్తి గారు. ఆలస్యంగా అభ్యసించటం వలనగుర్తింపు కూడా ఆలస్యంగానే వచ్చింది. తర్వాత శ్రీ ముసునూరి సూర్యనారాయణ దాసు గారివద్ద మహాభారత స్క్రిప్ట్ రాయటం నేర్చుకొన్నారు.

రామాయణ, మహాభారత కథలను హరికథా గానం చేస్తూ ఇప్పటికి 1500 పైగా దేశ, విదేశాలలో ప్రదర్శనలిస్తూ భారతీయ సంప్రదాయాన్ని ప్రచారం చేశారు. భాగవతం, భగవద్భక్తులు. జగద్గురు భోధలు, జాతీయ నాయకులపై కథాగానం భక్తితోపాటు జాతీయ సమైక్యత, భారాతీయ, తెలుగు సంస్కృతీ సంప్రదాయాలను ప్రచారం చేశారు.

కర్ణాటక సంగీత త్రిమూర్తులైన త్యాగయ్య, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితార్‌ల ఉత్సవాలను పెద్దఎత్తున గుంటూరు, విజయవాడ, హైదరాబాద్, కడప, విశాఖపట్నం మెదలైన నగరాలలో నిర్వహించి ఆత్రయానికి నీరాజనాలు అందించారు.

గుంటూరులో స్థిర నివాసం గా ఉంటూ శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారామణదాసు గారి పేరిట "గాన కళాపీఠం"ను 2002లో స్థాపించి, హరికథలనే జీవితంగా ఎంచుకొని త్యాగమయ జీవితం గడుపుతూ కథాగానం చేసిన మహామహులను సన్మానించి ప్రోత్సహించారు. వివిధ కళారంగాలలో ప్రసిద్ధులను ఎంపిక చేసి సత్కరించారు.

9-12-2007 న కిన్నెర ఆర్ట్స్ థియేటర్ వారి సహకారంతో మహా భారతం పై నిర్విరామంగా 12 గంటలకు కథాగానం చేసి రికార్డ్ సృష్టించారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డి, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గార్ల చేతులమీదుగా ఘన సన్మానం అందుకొన్నారు. దాదాపు 70 సంవత్సరాలు హరికథాగానానికే జీవితాన్ని అంకితం చేసిన మహానుభావులు శ్రీ కోట భాగవత్ గారు. ఒకప్పుడు గొప్ప వెలుగు వెలిగిన హరికథ, బుర్రకథ, వొగ్గు కథ ప్రస్తుతం ఆదరణ లేక చిన్నబోయినందుకు బాధ పడుతున్నారు దాసుగారు. పూర్వకాలం నుంచి ఆంధ్ర దేశం హరికథలను బాగా ప్రోత్సహించి పోషించి నందుకు, అగ్రస్థానంలో ఉన్నందుకు గర్వంగా ఉందని సంతోషిస్తున్నారు.

దాసుగారికి కథా గాన నైపుణ్యానికి తగిన బిరుదులూ సత్కారాలు లభించాయి. వారి బిరుదులలో సార్థకమైనవి-మధుర గాన కళానిధి హరికథకేసరి, హరికథ చక్రవర్తి, హరికథ సామ్రాజ్య సార్వ బౌమ, కథాగాన కళాకోవిద, హరికథా చూడమణి, హరికథ సవ్యసాచి, హరికథ సరస్వతి, హరికథ బాస్కర, విశ్వకళ ప్రపూర్ణ, హరికథ సుధార్ణవ, హరికథ సామ్రాట్, రెడియో, టి.వి.లలో దాసు గారు టాప్ గ్రేడ్ ఆర్టిస్ట్. న్యూఢిల్లీ నుంచి హైదరాబాద్, కలకత్తా , బొంబాయ్, మద్రాస్, మైసూర్ మొదలైన ప్రముఖ నగరాలు, పట్టణాలు, ఉయ్యూరు వంటి గ్రామాలు, తిరుపతి, కళాహస్తి వంటి పుణ్యక్షేత్రాలలో సుమారు 50చోట్ల కథాగానం చేసి శ్రోతలను మైమరిపించారు. దేశంలోనే కాదు విదేశాలలోను హరికథాగానం చేసి లండన్‌లో బర్మింగ్ హాం, లివర్పుల్, మారిషస్ మొదలైన చోట్ల ప్రజలను తన్మయులను చేశారు. వారి శ్రావ్య కంఠం, నృత్యం తనివితీర చూసి తరించాలనిపిస్తాయి. అన్ని స్థాయిలలో వారి గాత్రం మురిపిస్తుంది, మైమరపిస్తుంది. భక్తిలో ఓలలాడాస్తుంది. వారి కథాగానం వినటం, చూడటం మహాఅదృష్టం. కోట భాగవతార్, గారిని సన్మానించని సాహిత్య సంస్థ, సత్కరించని ప్రముఖులు లేరు. అంటే అతిశయోక్తి కాదు.

దాసుగారు కథాగానం చేయటమే కాదు, ఆ రంగంలో గొప్ప రచయిత కూడా. మహాభారత, రామాయణ, భాగవత హరికథలపైనా, హరికథాగానం మూలంపైన సిద్ధాంతవ్యాసాలు రాశారు.

ఇలాంటి పుంభావ సరస్వతి పద్మశ్రీ కోట సచ్చిదానంద శాస్రి భాగవతార్ గారికి సరసభారతి శ్రీ శోభకృత్ ఉగాది వేడుకలలో జీవిత సాఫల్య పురస్కారం అందజేస్తున్నందుకు గర్వపడుతూ వారు, స్వీకరించటానికి సమ్మతించినందుకు కృతజ్ఞతలు తెలియజేస్తుంది.

తేది , సమయం :
19-3-2023
వేదిక :
శ్రీనాగళ్ళరాజేశ్వరమ్మజానకిరామయ్య విజ్ఞాన కేంద్రం ,ఉయ్యూరు

గబ్బిట దుర్గా ప్రసాద్
అధ్యక్షులు
సరసభారతి - ఉయ్యూరు

కర్ణాటక సంగీత త్రిమూర్తులైన త్యాగయ్య ,శ్యామ శాస్త్రి ,ముత్తుస్వామి దీక్షితార్ ల ఉత్సవాలను పెద్ద ఎత్తున గుంటూరు విజయవాడ ,హైదరాబాద్ కడప ,విశాఖ పట్నం మొదలైన నగరాలలో నిర్వహించి ఆత్రయానికి నీరాజనాలు అందించారు .

గుంటూరులో స్థిర నివాసం గా ఉంటూ శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు గారి పేరిట''గాన కళా పీఠం''ను 2002లో స్థాపించి ,హరికథలనే జీవితంగా ఎంచుకొని త్యాగమయ జీవితం గడుపుతూ కథా గానం చేసిన మహామహులను సన్మానించి ప్రోత్సహించారు .వివిధ కళారంగాలలో ప్రసిద్ధులను ఎంపిక చేసి సత్కరించారు .

9-12-2007 న కిన్నెర ఆర్ట్స్ థియేటర్ వారి సహకారంతో మహా భారతం పై నిర్విరామంగా 12గంటలు కథాగానం చేసి రికార్డ్ సృష్టించారు .మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి ,శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గార్ల చేతులమీదుగా ఘన సన్మానం అందుకొన్నారు .దాదాపు 70 సంవత్సరాలు హరికథాగానికే జీవితాన్ని అంకితం చేసిన మహా నుభావులు శ్రీ కోట భాగవతార్ గారు .ఒకప్పుడు గొప్ప వెలుగు వెలిగిన హరికథ,బుర్రకథ ,వొగ్గు కథ ప్రస్తుతం ఆదరణ లేక చిన్నబోయినందుకు బాధ పడుతున్నారు దాసుగారు .పూర్వకాలం నుంచి ఆంద్ర దేశం హరికథలను బాగా ప్రోత్సహించి పోషించి నందుకు, అగ్రస్థానం లో ఉన్నందుకు గర్వంగా ఉందని సంతోషిస్తున్నారు .



దాసుగారికి కథా గాన నైపుణ్యానికి తగిన బిరుదులూ సత్కారాలు లభించాయి .వారి బిరుదులలో సార్ధకమైనవి –మధుర గాన కళానిధి హరికథకేసరి ,హరికథ చక్రవర్తి ,హరికథ సామ్రాజ్య సార్వ భౌమ ,కథాగాన కళాకోవిద,హరికథా చూడామణి ,హరికథ సవ్యసాచి ,హరికథ సరస్వతి ,హరికథ భాస్కర ,విశ్వకళా ప్రపూర్ణ ,హరికథ సుధార్ణవ ,హరికథ సామ్రాట్ .రేడియో టివి లలో దాసుగారు టాప్ గ్రేడ్ ఆర్టిస్ట్ .

న్యు ఢిల్లీ నుంచి హైదరాబాద్ ,కలకత్తా బొంబాయ్ మద్రాస్ ,మైసూర్ మొదలైన ప్రముఖ నగరాలు పట్టణాలు ,ఉయ్యూరు వంటి గ్రామాలు ,తిరుపతి కాళహస్తి అన్నవరం వంటి పుణ్య క్షేత్రాలలో సుమారు 50 చోట్ల కథాగానం చేసి శ్రోతలను మై మరపించారు . దేశంలోనే కాదు విదేశాలలోనూ హరికథా గానం చేసి లండన్ బర్మింగ్ హాం ,లివర్పూల్ ,మారిషస్ మొదలైన చోట్ల ప్రజలను తన్మయులను చేశారు. వారి శ్రావ్య కంఠం,నృత్యం తనివి తీర చూసి

తరించాలనిపిస్తాయి .అన్ని స్థాయిలలో వారి గాత్రం మురిపిస్తుంది మై మరపిస్తుంది భక్తిలో ఓలలాడిస్తుంది .వారి కథాగానం వినటం ,చూడటం మహా అదృష్టం .కోట భాగవతార్ గారిని సన్మానించని సాహిత్య సంస్థ , సత్కరించని ప్రముఖులు లేరు అంటే అతిశయోక్తి కాదు .

దాసుగారు కథాగానం చేయటమే కాదు,ఆరంగం లో గొప్ప రచయితకూడా .మహాభారత, రామాయణ ,భాగవత హరికథలపైనా ,హరికథాగానం మూలం పైనా సిద్ధాంత వ్యాసాలు రాశారు.

ఇలాంటి పుంభావ సరస్వతి పద్మశ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి భాగవతార్ గారికి సరసభారతి శ్రీ శోభకృత్ ఉగాది వేడుకలలో జీవితసాఫల్య పురస్కారం అంద జేస్తున్నందుకు గర్వ పడుతూ వారు, స్వీకరించటానికి సమ్మతించినందుకు కృతజ్ఞతలు తెలియ జేస్తోంది .

## 2- సరసభారతి –సాహిత్య సాంస్కృతిక సంస్థ –ఉయ్యూరు

శ్రీ సుశీల్ కుమార్ మిశ్రో గారికి సరసభారతి అందిస్తున్న జీవిత సాఫల్య పురస్కార ం

మిశ్రో గా ప్రసిద్ధులైన శ్రీ సుశీల్ కుమార్ మిశ్రో, శ్రీ శశిభూషణ్ మిశ్రో ,శ్రీమతి సరోజిని దంపతులకు 4-1-1945 న విశాఖ పట్నం లో జన్మించారు .డిగ్రీ పాసై విశాఖ లో పోర్ట్ ట్రస్ట్ లో ఉద్యోగించారు .చదువుకొనే రోజుల్లోనే 1960లలో నాటకాలలో నటిస్తూ మంచి పేరు పొందారు .ఆంధ్ర విశ్వ విద్యాలయం లోని రంగస్థల కళల శాఖలో ఆ కళాశాల ప్రధమ దర్శకుడు ''నటరాజ'' శ్రీ కె.వెంకటేశ్వరరావు గారి వద్ద నటన ,దర్శకత్వం పోకడలపై పూర్తి అవగాహనలను పుణికి పుచ్చుకొని రాటు దేలి , ''డిప్లమో ఇన్ ధియేటర్ ఆర్ట్స్'' డిగ్రీ పొందారు . శ్రీమతి ఆచలదేవి ని వివాహ మాడారు . ఆ దంపతులకు ఇద్దరు కుమారులు . ఇద్దరూ సాఫ్ట్ వేర్ ఇంజనీర్లుగా అమెరికాలో స్థిర పడ్డారు .

" అక్షరం లోక రక్షణం "

# సరసభారతి

## సాహిత్య సాంస్కృతిక సంస్థ - ఉయ్యూరు

శ్రీశోభకృత్ ఉగాది వేడుకలు

172 వ కార్యక్రమం

## సన్మాన పత్రం

శ్రీ సుశీల్ కుమార్ మిశ్రో గారికి సరసభారతి అందిస్తున్న జీవిత సాఫల్య పురస్కారం

మిశ్రో గా ప్రసిద్ధులైన శ్రీ సుశీల్ కుమార్ మిశ్రో, శ్రీ శశిభూషణ్ మిశ్రో, శ్రీమతి సరోజినిదేవి దంపతులకు 4-1-1945న విశాఖపట్నంలో జన్మించారు. డిగ్రీ పాసై విశాఖలో పోర్ట్ ట్రస్ట్‌లో ఉద్యోగించారు. చదువుకొనే రోజుల్లోనే 1960లలో నాటకాలలో నటిస్తూ మంచి పేరు పొందారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని రంగస్థల కళల శాఖలో ఆ కళాశాల ప్రథమ దర్శకుడు నటరాజు శ్రీ కె.వెంకటేశ్వరరావు గారివద్ద నటన, దర్శకత్వం పోకడలపై పూర్తి అవగాహనలను పుణికి పుచ్చుకొని రాటుదేలి, "డిప్లమో ఇన్ థియేటర్ ఆర్ట్స్" డిగ్రీ పొందారు. శ్రీమతి సచలదేవిని వివాహ మాడారు. ఆదంపతులకు ఇద్దరు కుమారులు. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లుగా అమెరికాలో స్థిరపడ్డారు.

1958లో మొదటి నాటకం "దొంగ" ప్రదర్శించి మెప్పు పొందారు. 1956లో "కళాభారతి" స్వీయ దర్శకత్వంలో అన్నచెల్లెలు, రక్తసంబంధం, చెరపకురా చెడేవు నాటకాలు ప్రదర్శించారు. గురువు శ్రీ కె.వెంకటేశ్వరరావు గారివద్ద పొందిన శిక్షణ తో పరిపక్వమైన మిశ్రో. గురువుగారు స్థాపించిన "బహురూపనటసమాఖ్య" ను గురువు గారి మరణంతో సంస్థను తన భుజ స్కంధాలపై వేసుకొని సమర్ధవంతంగా నడిపిస్తున్నారు. ఇంతవరకు 25నాటకాలు, 50 నాటికలు ప్రదర్శించారు. 1968 లో "రసమయి నట సమాఖ్య " స్థాపించి అనేక నాటకపోటీలలో నటించి, దర్శకత్వం వహించి ఉత్తమ నటన, ఉత్తమ ప్రదర్శన, ఉత్తమ దర్శకత్వం లకు బహుబహుమతులు పొందారు.

1971లో ఢిల్లీలో 26 దేశాలు పాల్గొన్న "" లో శ్రీ గణేశ్ పాత్రతో రచించిన "పావల" నాటికను మిశ్రో అత్యంత సమర్ధవంతంగా ప్రదర్శించి మెప్పు పొందారు. 1972లో ఢిలీ లోని పూనా నేషనల్ ఇన్‌స్టిట్యూట్ నిర్వహించిన బహుభాషా నాటకోత్సవాల్లో పాల్గొని "త్రివేణి" నాటిక ప్రదర్శనకు, ఉత్తమ ప్రదర్శనకు, తాను నటించిన "నేస్తలింగం" పాత్రకు ఉత్తమ నటుడి బహుమతి అందుకొన్నారు. విశాఖపట్నం లో ప్రారంభోత్సవం సంధర్భంగా వందమంది కళాకారులతో నాటకం ఆధారంగా ప్రదర్శించారు. బెంగుళూరులో తెలుగు మహాసభలు జరిగిన సందర్భంలో "కాలధర్మం" నాటిక ప్రదర్శించారు.

జీవన్నాటకం ప్రక్రియ ఆధారంగా 50 మంది కళాకారులతో "హోమియోద్రష్ట డా॥హానిమన్" ప్రదర్శించి అభినందనలు అందుకొన్నారు. 2011లో 60మంది ఆర్టిస్టులతో "శ్రీ కృష్ణ సందేశం" ప్రదర్శించారు. ఇలా ప్రయోగాలలో తనకు తామే సాటి అనిపించారు. ప్రముఖ సినీనటుల ను కూడా తన నాటికల్లో నటింప జేసిన ఘనత మిశ్రోది. "కాలక్షేపం" నాటికలో శ్రీ చంద్రమోహన్ గారు. "బెత్తం మనిషి"నాటికలో శ్రీ కమలహాసన్, శ్రీరావుగోపాలరావు గార్లు నటించటం విశేషం. విశాఖపట్నం రేడియో కేంద్రంలో "టాప్ గ్రేట్ ఆర్టిస్ట్". 100 రేడియో నాటికలు ప్రదర్శించారు. నాటక రేడియో రంగాలలో తనదైన ప్రత్యేక ముద్ర వేసిన మిశ్రో టి.వి. సినిమాలలోనూ నటించి తన ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించి రాణించారు.

బుల్లితెర అనే టి.వి. లోనూ తన నటనా పాటవం చూపారు మిశ్రో. డిటెక్టివ్ సుబ్బారావు, మల్లాది రామ కృష్ణ శాస్త్రి కథలు, భ.రా.గో.కథలు, వండర్ బాయ్ సీరియల్స్‌లో నటించి తన నటనా సామర్థ్యం నిరూపించారు. శ్రీ బాపు గారి దర్శకత్వంలో "శ్రీ భాగవతం" సీరియల్ లోనూ నటించారు.

1972లో శ్రీ బి.వి.ప్రసాద్. దర్శకత్వంలో మొదటి సినిమా "నీడలేనిఆడది" లో నటించి తెరంగేట్రం చేశారు. ప్రముఖ దర్శకుడు శ్రీ కె.బాలచందర్ గారి వద్ద మూడుచిత్రాలకు సహాయదర్శకునిగా పనిచేశారు.కళాతపస్వి శ్రీ కె.విశ్వనాథ్‌గారి దర్శకత్వం లో 10చిత్రాల్లో నటించారు. అందులో "సిరివెన్నెల"లలో తాత గారి పాత్ర అత్యంత ప్రాముఖ్యమైంది. కథకు ఆయువు పట్టు. అందులో మిశ్రో అనితర సాధ్యంగా నటించి మెప్పించారు. అలాగే శ్రుతిలయలు సినిమాలో మాటలగారడి చేసే ఆటో డ్రైవర్ పాత్ర స్వాతిముత్యంలో డాన్స్ డైరెక్టర్ పాత్రా కూడా గొప్పవే. సుమారు 40 సినిమాలలో గుర్తింపుదగిన పాత్రలు పోషంచారు.

శ్రీ ఎస్.కె.మిశ్రో తమ నటన, దర్శకానుభవాలకు తగిన పురస్కారాలు అందుకొన్నారు. అందులో ముఖ్యమైనవి-కళాసాగర్ పురస్కారం. గరికపాటి రాజారావు అవార్డ్, కళాజగపతి అవార్డ్, నంది పురస్కారం, బెస్ట్‌వాయిస్ ఆఫ్ ఇయర్ అవార్డ్ (1982), తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిభా పురస్కారం ముఖ్యమైనవి.

తమ గురువు నటరాజ శ్రీ కె.వెంకటేశ్వరరావు గారు అంటే మిశ్రో గారికి మహా ఆరాధన, గౌరవం, పరవశం.

ఇంతటి ప్రజ్ఞాశీలికి సరసభారతి శ్రీ శోభకృత్ ఉగాది వేడుకల సందర్భంగా శ్రీ మిశ్రో గారికి జీవిత సాఫల్య పురస్కారం అందజేయటం గర్వంగా భావిస్తోంది శ్రీ మిశ్రో అంగీకరించి స్వీకరిస్తున్నందుకు ధన్యవాదాలు.

తేది , సమయం :
19-3-2023
వేదిక :
శ్రీనాగళ్ళరాజేశ్వరమ్మజానకిరామయ్య విజ్ఞాన కేంద్రం ,ఉయ్యూరు

గబ్బిట దుర్గా ప్రసాద్
అధ్యక్షులు
సరసభారతి - ఉయ్యూరు

1958 లో మొదటి నాటకం ''దొంగ ''నాటకం ప్రదర్శించి మెప్పు పొందారు .1956లో ''కళాభారతి ''స్వీయ దర్శకత్వంలో అన్నా చెల్లెలు ,రక్త సంబంధం ,చెరపకురా చెడేవు నాటకాలు ప్రదర్శించారు .గురువు శ్రీ కె. వెంకటేశ్వర రావు గారి వద్ద పొందిన శిక్షణ తో పరిపక్వమైన మిశ్రో ,గురువుగారు స్థాపించిన ""బహురూప నట సమాఖ్య ''ను గురువుగారి మరణం తో సంస్థను తన భుజ స్కందాలపై వేసుకొని సమర్ధ వంతంగా నడిపిస్తున్నారు .ఇంతవరకు 25 నాటకాలు 50 నాటికలు ప్రదర్శించారు .1968లో ''రసమయి నట సమాఖ్య ''స్థాపించి అనేక నాటకపోటీలలో పాల్గొని నటించి , దర్శకత్వం వహించి ఉత్తమ నటన,ఉత్తమ ప్రదర్శన ,ఉత్తమ దర్శకత్వం లకు బహుబహుమతులు పొందారు.

1971 లో డిల్లిలో 26 దేశాలు పాల్గొన్న "కామన్ వెల్త యూత్ ఫెస్టివల్ ''లో శ్రీ గణేష్ పాత్రో రచించిన ''పావల"నాటిక ను మిశ్రో అత్యంత సమర్ధ వంతంగా ప్రదర్శించి మెప్పు పొందారు ..1972లో డిల్లీ లోని పూనా నేషనల్ ఇన్ స్టిట్యూట్ నిర్వహించిన బహుభాషా నాటకోత్సవాల్లో పాల్గొని ,"త్రివేణి ''నాటిక ప్రదర్శించి ,ఉత్తమ ప్రదర్శనకు ,తాను నటించిన ''నేస్తలింగం ''పాత్రకు ఉత్తమ నటుడి బహుమతి అందుకొన్నారు .విశాఖ పట్నం సెయింట్ ఆంథోని చర్చిప్రారంభోత్సవ సందర్భంగా వందమంది కళా కారులతో జిసెస్ క్రైస్ట్ '' నాటకాన్ని సౌండ్ అండ్ లైట్ టెక్నిక్ తో ప్రదర్శించారు .బెంగుళూరు లో జరిగిన తెలుగు మహాసభలలో ''కాల ధర్మం ''నాటిక ప్రదర్శించారు .

జీవన్నాటక ప్రక్రియ ఆధారంగా2009లో 50 మంది కళాకారులతో ''హోమియో దృష్టి లో హానిమన్ ''ప్రదర్శించి అభినందనలు అందుకొన్నారు .2011లో 60 మంది ఆర్టిస్ట్ లతో ''శ్రీ కృష్ణ సందేశం ''ప్రదర్శించారు .ఇలాప్రయోగాలలో తనకు తామే సాటి అనిపించారు .




ప్రముఖ సినీ నటుల ను కూడా తన నాటికల్లో నటింప జేసిన ఘనత మిశ్రో ది.కాలక్షేపం నాటికలోశ్రీ చంద్రమోహన్ ,బెత్తం మనిషి నాటికలో శ్రీ కమల హాసన్ ,శ్రీ రావు గోపాలరావు గార్లు నటించటం విశేషం .

విశాఖ పట్నం రేడియో కేంద్రం లో" టాప్ గ్రేడ్ ఆర్టిస్ట్ ''.100 రేడియో నాటికలు ప్రదర్శించారు .

నాటక రేడియో రంగాలలో తనదైన ప్రత్యేక ముద్ర వేసిన మిశ్రో టివి ,సినిమాలలోనూ నటించి తన ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించి రాణించారు .

బుల్లితెర అనే టి.వి .లోనూ తన నటనా పాటవం చూపారు మిశ్రో ..డిటెక్టివ్ సుబ్బారావు ,మల్లాది రామ కృష్ణ శాస్త్రి కథలు ,భ.రా.గో .కథలు ,వండర్ బాయ్ సిరియల్స్ లో నటించి తన నటనా సామర్ధ్యం నిరూపించారు .శ్రీ బాపు గారి దర్శకత్వం లో ''శ్రీ భాగవతం ''సిరియల్ లోనూ నటించారు .

1972లో శ్రీ బివి ప్రసాద్ దర్శకత్వంలో మొదటి సినిమా ''నీడ లేని ఆడది ''లో నటించి తెరంగేట్రం చేశారు .ప్రముఖ దర్శకుడు శ్రీ కే,బాల చందర్ గారివద్ద మూడు చిత్రాలకు సహాయ దర్శకుడిగా పని చేశారు .కళాతపస్వి శ్రీ విశ్వనాథ్ దర్శకత్వం లో 10 చిత్రాలలో నటించారు .అందులో ''సిరివెన్నెల ''లలో

తాత గారి పాత్ర అత్యంత ప్రాముఖ్యమైంది .కథకు ఆయువు పట్టు. అందులో మిశ్రో అనితర సాధ్యంగా నటించి మెప్పించారు .అలాగే శ్రుతిలయలు సినిమాలో మాటలగారడి చేసే ఆటో డ్రైవర్ పాత్ర,స్వాతిముత్యం లో డాన్స్ డైరెక్టర్ పాత్రా కూడా గొప్పవే .సుమారు 40 సినిమాలో గుర్తింపదగిన పాత్రలు పోషించారు .

శ్రీ .ఎస్ .కె.మిశ్రో తమ నటన ,దర్శకానుభవాలకు తగిన పురస్కారాలు అందుకొన్నారు .అందులో ముఖ్యమైనవి –కళాసాగర్ పురస్కారం ,గరికపాటి రాజారావుఅవార్డ్ ,కళాజగపతి అవార్డ్ ,నంది పురస్కారం, బెస్ట్ వాయిస్ ఆఫ్ ఇయర్ అవార్డ్(1982),తెలుగు విశ్వవిద్యాలయం వారి ప్రతిభా పురస్కారం ముఖ్యమైనవి .

తమ గురువు నటరాజ శ్రీ కె.వెంకటేశ్వర రావు గారు అంటే మిశ్రో గారికి మహా ఆరాధన ,గౌరవం ,పరవశం .

ఇంతటి ప్రజ్ఞాశీలికి సరసభారతి శ్రీ శోభాకృత్ ఉగాది వేడుకల సందర్భంగా శ్రీ మిశ్రోగారికి జీవిత సాఫల్య పురస్కారం అందజేయటం గర్వంగా భావిస్తోంది శ్రీ మిశ్రో అంగీకరించి స్వీకరిస్తున్నందుకు ధన్యవాదాలు

# సరసభారతి శ్రీ శోభకృత్ ఉగాది వేడుకలలో నిర్వహించిన కవిసమ్మేళనం

## కవుల కవితలు -1

## తరంతరం నిరంతరం ఈ పయనం

శ్రీ కందికొండ రవికిరణ్ –విజయవాడ -94912 98990

సరసభారతి, శ్రీ శోభ కృత్ ఉగాది వేడుకల్లో, కవిసమ్మేళనంలో పాల్గొని కవిత చదివే సదవకాశం కలిగించిన శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ గారి అభిమానానికి ధన్యవాదాలు తెలుపుకుంటూ

### తరంతరం నిరంతరం ఈ పయనం

మిగిల్చాయి ప్రజాలోకానికి –శార్వరీ ప్లవలు –మున్నెరుగని చేదు అనుభవాలు- తూకమేసి చూస్తె తీపికంటే మిక్కిలిగా.
అయినా అంతెత్తున నిలిపి –మన సంప్రదాయ సంస్కార ప్రాధాన్యతను
ప్రపంచానికి తెలిపాయి
ప్రాణాలు నిలిపే దాని విలువ –డాలర్ రూబుల్ ,పౌండ్ లకన్నా అధికమని
.
శుభ కృత్ వచ్చింది ఘన సంప్రదాయాన్ని ద్రవీకరించింది
హృదయాల గాయాలకు లేపనమై –కించిత్ ఉపశమనం కలిగించింది .
వాడి వడలి రాలిపోయిన గానీ –అక్షర ప్రసూనాల సుగంధ సౌరభాలను
కైక సుతునిలా శిరసున దాల్చి సాగిపోదాం –ముందుకు చేర్చుదాం
ముందు తరాలకు
ఆశిద్దామిప్పుడు శోభ కృత్ లో మొలకెత్తిన శుభాలు
చిగురులేసి ,పుష్పించి ఫలభరితమవాలని
దిగులు మబ్బుల తెరతొలగిన దివాకరునిలా –మానవాళి హృదయాలు ప్రకాశించాలని
పికారు చేస్తున్న కొత్త వైరస్ ,పుకారు కావాలని –శోభ కృత్ సార్ధక నామగా శ్లాఘింప బడాలని
మంచే జరగాలని ,ఎప్పుడైనా శత్రు నివహానికైనా
దేశమాత చుట్టూ చేరే ఆపదలు రాహు కేతు గ్రస్థ గ్రహణాలై
కర్రతాకిడికి తునాతునకలై చెల్లా చెదురయ్యే మట్టి కుండ లవ్వాలని
భరత జనతకు సరిపడా శక్తి యుక్తులిచ్చి – ఆ విశ్వనాథ శ్రీరాములు రక్ష చేయాలని



అభిలషిద్దాం  మంచి మనసున్న మనుషులుగా
నేను బాగుపడాలంటే దేశం బాగు పడాలి –దేశం బాగు పడాలంటే దైవం అండగా ఉండాలి .

—మీ కందికొండ రవికిరణ్, విజయవాడ

## శుభ కృత్ పోయిరమ్మ

శ్ర తుమ్మోజు రామ లక్ష్మణా చార్యులు –విజయవాడ -97037 76650

## శుభ కృత్ పోయిరమ్మ

1-శుభములిత్తువనుచు శుభ్రంపు మనసుతో –స్వాగత గీతాలు పాడినాము
ఎవ్వరికే మేలు ఇంపుగా నిచ్చెనో –ఆంధ్ర దేశ స్థితి అట్టే యుండే
శుభముకోరని పరిశుద్ధాత్ము లీరనుచు –శుభము లీకనే యేగే శుభ కృతొర
ఊరు దిబ్బైనపుడు పేరు గొప్పేముంది –శుభ కృత్ తానేమి శుభములిచ్చు ?
పోయిరావమ్మ శుభ కృత్ పోయి రమ్ము –సుకృతి షష్టి పూర్తికి నీవు శుభము లెన్నో
తెచ్చి ఈవమ్మ ఆంధ్రులు మెచ్చగాను –కాల చక్రంపు రధముపై  కమ్రగతిని .
ఓయి శోభ కృత్ వసంతమా !
2-నీ వచ్చు దారిలో ఏ గోతిలో నీవు- పడకుండమడుగులన్ పరచమైతి
ఫ్లెక్సీల స్వాగతాల్ లెస్సగా పెట్టించ –తెలుగేల నిదియంచు త్రుంచినారు
మామిడి తోరణాల్ మక్కువతో కట్టించ –చెట్లంచు భ్రమతోడ కొట్టినారు
పీతాంబరములతో వీధులన్ నిలుచుండ –ఆబోతులే క్రుమ్మె నావలకు
కొమ్మ రెమ్మలందు కోయిలల్ కాదు మా-చెట్లదారులన్ని చిన్న బోయే
శోభ కృత్ నీకు సుస్వాగతముపల్క-సరసభారతి యిట సభను దీర్చె .
ఆకాంక్ష
3-బుద్ధులౌ నీతికి బద్ధులౌ నేతల -పావన పాలనన్ దేశమ్ము భద్రమౌత
శిరమెత్తు శైలాల శిఖరాల పైనుండి –ప్రవహించు నదులెల్ల పారుగాక
ఋషుల కొండలపైన క్రీడించు శాంతమ్ము –అశాంత మట్టులే అలరుగాక
రాజ్యాధికారమ్ము భోజ్యాధికారమన్-స్వార్ధ చింతన లేని ప్రభుత అగుత
దుష్టగ్రహములన్ దూరాన నిలబెట్టి –గురు శుక్రయోగమ్ము కూర్చుగాక
తెలుగు పీఠమ్ము పై నిలిచి" వెన్నెల రేడు" –తెలుగుల వెలుగులన్ వెలయుగాక
అక్షరాభ్యాసమ్ము ఆంగ్లాన జరిపించు –కాలమ్ము రాకుండకాచుగాత
అమరావతీ శోభ అమృతంపు విభవమై –పెనుపొందిలోకాన వెలయుగాక
అభయ మౌనట్టి జీవన మమరుగాక –తెలుగు నేలలు సౌభాగ్యాల నెలవులగుచు
తెలుగు భాషయే భాష్యమై నిలుచుగాక-శోభ కృతు !మాకు శుభముల శోభనిమ్ము .



## శోభ కృత్ కు స్వాగతం

మధురకవి శ్రీమతి ముదిగొండ సీతారామమ్మ –మచిలీ పట్నం -92993 03035

## శోభ కృత్ కు స్వాగతం



-1-ఉ-రాగదే నవ్య వత్సరమ లాలిత సద్గుణ రూప మందుచున్ –రాగదవే శుభా కృతిని రంజిలజేసెడిపాలనంబుతో
రాగదే శోభనా కృతిగ రమ్య రసంబులు పంచ వేడ్కతో –రాగదే దివ్యభావమూల రాసి ని పెంచు సెపంబు తోడుతన్ .
2-స్వాగతమోయి శోభ కృతు స్వాగతమంచు పల్కు తుంటి –ఏ రోగములేని జీవితము రోద నెరుంగని మానవత్వమున్
ఆగని భక్తిభావములు ఆశ్రిత దీన జనాలి రక్షయున్ – సాగగ చేయవె సతతము సత్యము ధర్మమూ దాటకుండగన్ .
3-ఆరురుచులు నేడు యణగారిపోయెను –కొత్త రుచులు పెరిగే ,కోర్కె పెరిగే
కలియుగంబు నందు కనిపించదే నీతి –కరుణ జూపు నవ్యకాంతి నిచ్చి.

## శుభ కృత్ అనుభవాలతో శోభ కృత్ కు స్వాగతం

శ్రీ కోగలి రాజ శేఖర్ –విజయవాడ -9491737060

-శుభ కృత్ అనుభవాలతో శోభ కృత్ కు స్వాగతం -
ఉగాదికి స్వాగతం

దేవుని చిత్తం –రుతువుల వృత్తం –జీవిపుట్టుక పునాది –కాలగమనాలకు ఆది
తీయతీయని బెల్లం –ఘాటుకారపు మిరియం –చేదు వేప చిగుళ్ళు –పుల్లనైన మామిళ్ళు –
పచ్చిజామ వగరు
ఉప్పుతో రుచులు ఆరు –సస్కృతికి చాటింపు –షడ్రుచుల మేళవింపు
తీపి సంతోషానికి –చింత దుఖానికీ –మామిడి ఆశ్చర్యానికీ –వగరు అసహ్యానికి –
కారం కోపానికి –ఉప్పు భయానికి –రుచులు మరిగిన దేహం –చూపు తమ ప్రభావం
పచ్చిలో దాగుంది శాస్త్రీయత –అది ఆయుర్వేదపు ఘనత .
వేప చేదు నివేదన-చెడు బ్యాక్టీరియా నిర్మూలన
చింత మామిడి తురుము –అంటువ్యాధులు తరుము
షడ్రుచుల పచ్చడి సేవన –దేహాంతర ప్రక్షాళన
ప్రతికొమ్మా పువ్వులతోస్వాగతం –ప్రతిపువ్వు పులకరింపుల పరిమళింపు
ప్రతిపల్లె ఆనందపు సంబరం –ప్రతి యింట మామిళ్ళ తోరణం
శుభంగా వచ్చే శోభ కృత్ ఉగాది –తెలుగువారి సంతోషాల సారధి .
పసివారి ఆటల అరుపులు – ముత్యాలముగ్గుల మెరుపులు
పూజించే హృదయాలకు హారతి –మంచిమార్పు కోరుతుంది జగతి
ప్రగతికి జయ మంగళం –శోభ కృత్ కు ఆలింగనం .



## శుభం పలుకుదాం

శ్రీ చెన్నాప్రగడ వివిఎన్ ఎస్ శర్మ –విజయవాడ -9440 587567

## శుభం పలుకుదాం

వేయి శుభములు కలుగకపోయినా –ఎన్నో కొన్ని అందించిన
శుభ కృత్ నామ సంవత్సరమా నీకు జేజేలు .
ఎన్నెన్నో ఉన్నత చదువులు చదివినా –పట్టభద్రులకు కొలువులు లేవు
ఎంతటి సుగుణాల రాముడైనా –ఈడొచ్చిన పిల్లాడికి పెళ్ళి కావటం లేదు
అతివలపై ఆగని అఘాయిత్యాలు –అంగడి సరుకుగా మారిన ప్రశ్నా పత్రాలు
అంతు చిక్కని నేతల స్నేహాలు ,స్కాములూ

ఎన్నాళ్ళు భరించాలి ఈ నేరాలూ ఘోరాలూ ?
ఇవి మచ్చుకు కొన్నే మరకలు
నాణానికి రెండవ వైపులా మరికొన్ని మెరుపులూ ఉన్నాయ్
మెండుగా వర్షాలు కురిపించి నిండుగా పంటలు పండించావు
కర్షకుల ఇంట సిరులొలికించి –కడగండ్లు అంతమొందించావు
మహమ్మారి వ్యాదులెన్ని వచ్చినా – దేతుగాఎదురొడ్డిన సత్తామనది.
సినీనట దర్శక దిగ్గజాలను కోల్పోయినా –ఆస్కార్ కు ఆస్కారమిచ్చి ఘనకీర్తి పొందావ్
ఓశుభ కృత్ నీకు వీడ్కోలు
మనజీవితాలను శోభాయమానం చేయడానికి
తరలివస్తున్న శోభ కృత్ స్వాగతం ,సుస్వాగతం.



## జీవనయానం

శ్రీమతి ఎస్.అన్నపూర్ణ –విజయవాడ –

జీవనయానం

జీవన యానం –మన జీవన తేజం
కష్టాల కడగళ్ళు దాటి –శుభ కృత్ ఇచ్చిన నవ జీవంతో
ఆశల ఊసులు కళ్ళల్లో మెదులు తుండగా
కొత్త ప్రయత్నాల సూర్యకిరణాల ఉత్తేజం
తోడూ నీడగా సఫల మనో రధులమై
నూతన ఆవిష్కరణలూ,ఆనంద దీపావళి హేలలో డోల లూగి
శోభ కృత్ వత్సర నూతన వసంతానికి
ఆహ్వానం పలుకుతూ సుమదురంగా
గానం అందిస్తూ గండు కోయిలలు
శుభం భూయాత్ అనిపలుకుతున్న చిలుకలజంటల
శోభతో మంగళం మహాత్ .



# పట్టాభి షిక్తుడు

శ్రీ టి.రవీంద్ర –విజయవాడ -9490712065

## పట్టాభి షిక్తుడు

కొందరికి శుభం అంటే ముగింపు అని అర్ధం
మరికొందరికి శ్రీకారం అని భావం
పాత దానికి పడే శుభం కార్డు –మరో కొత్తకు శ్రీకార పర్వం .
పాతఅనుభవాల పవర్ హౌస్ ల నుంచి-కొత్తదారులు కాంతులీనుతాయి
పాతయుగపుశిలాజాలనుంచి
మంగళ యాన్ మహా సంకల్పం దాకా
గతించిన కాలం నేర్పిన పాఠాలు ఎన్నో .-వార్తలకెక్కని వర్తమానానికి రహదారులయ్యాయి
శుభ కృత్ పాతాళం లో పడేసి ఉంటే –ఒక కనపడని పునాదికి పురుడు పోసి ఉండ వచ్చు
మురికి కూపం లోకి విసిరేసి ఉంటే –సత్తువ ఉన్న విత్తనాలను అది గుర్తించి ఉండచ్చు
విస్ఫోటనమని వాటిని దీవించి ఉండొచ్చు
శుభకృ త్ వేసిన అనుభవాల పునాదులపై శోభ కృత్ సౌధనిర్మాణం కొన సాగిద్దాం
శోభ కృత్ శిఖరాగ్రం పై –విజయకేతనాన్ని ఎగరేద్దాం .
కన్నీటి చారల్ని ,చెమట ధారలలో తడిపేస్తూ
చెరగని సంకల్పం అంతర్వాహినిగా
త్రివేణీ సంగమం సృష్టిద్దాం .
పట్టు తప్పినా వాడు కూడా పట్టు బడితే
పట్టభాద్రుడౌతాడని ప్రకటిద్దాం .
పట్టువదలని విక్రమార్కుడు లోన ఉంటే
ఓటమి కాటు పడ్డవాణ్ణి సైతం
ఒకనాడు పట్టాభి షిక్తుని చేస్తాడని
సరికొత్త శోభ కృత్ సాక్షిగా నిరూపిద్దాం ,చూపిద్దాం .



8-శ్రీ మొరుమూరి శేషాచారి-గుంటూరు

సాక్ష్యాల సాక్షాత్కారం

నిజాల నిలువు టద్దానికెదురు-నిటారుగా నేను నిలబడ్డాను
నా కనుపాపల్లో గతించిన సాక్ష్యాలు –సాక్షాత్కారాన్ని కోరాయి .
"శుభ కృత్ "ల అడుగులు మదిలో సవ్వడి చేస్తున్నాయి
"వసంత "పరిమళాలు నాశికాగ్రాన్ని స్పృశిస్తున్నాయి
రంజింపజేసిన రవాలు –శ్రవణాలకు శ్రుతులను బోధిస్తున్నాయి
కడలి వెళ్ళిన కథలెన్నో –కనుబొమల కుదుళ్ళలో కుస్తీ పడుతున్నాయి

మూగ జీవాల మౌనరాగాలు –పెదాలపై పల్లవిస్తున్నాయి
నాకనుపాపల్లో –గతించిన సాక్ష్యాలు –సాక్షాత్కారం కోరుతున్నాయి .
మృదువైన మధురానుభూతులు –చెక్కిళ్ళను చుంబిస్తుంటే
కష్టాల కూడళ్ళు శిరస్సుపై –కురుల ఝరులై ఉరకలేస్తున్నాయి
కబళించిన కరాళ నృత్యాలు –నా కరాల నరాలను కదలిస్తున్నాయి
ఉదయ కాంతుల ఉజ్వల జీవితాలు –ముఖాన వికాసమైతే
ఆడపిల్లల ఆర్త నాదాలు –హృదయ ఘోషకు మూలాలవుతున్నాయి
ఇక
ప్రకకృతి తన వికృతత్వాన్ని విడిచి
శుభ కృత్ ముగింపు వేడుకలకు సన్నాహాలు చేయ మంటోంది
గతించిన సాక్ష్యాలను సాగనంప మంటోంది
నవ వసంత రాగాలతో "శోభ కృత్ "కు స్వాగత గీతాలు
రచించ మంటోంది

నా పాదాలు ఉత్తమ పదాల వైపు అడుగులేస్తున్నాయి .

## స్వాగతం పలుకుదాం

డా .మైలవరపు లలితకుమారి –గుంటూరు -9959510422

స్వాగతం పలుకుదాం



ఆకురాలేశిశిరాన్ని వీడుకోలుపుతూ –అవనికి అందాలు పంచాలని
ఆనందంతో మళ్ళీ వచ్చింది –ఆకు పచ్చని పట్టు చీర కట్టుకొని .
ఎర్రని చిగురులు చీరంచుకాగా –విరిసిన పూలు చుక్కలై మెరియగా
తరువులన్నీ ఒయ్యారాలొలుకగా
మావి చివురులు మేసిన కోకిలస్వామి
గొంతు సవరించుకొని –చిటారు కొమ్మన ఉయ్యాలలూగుతూ
షడ్జమంలో రాగాలాపన చేస్తుంటే
పెద్ద ముత్తైదువ చిలుక పేరంటాలుకాగా
వేయి వెలుగుల సూరీడు –మేలు కొలుపులు పాడ
నింబకుసుమాలు అక్షతలు కాగా
నీల గగనమే ఆతపత్రమై భాసింప

విరగబూసిన గున్న మావిమాకు ను
అల్లు కుంటున్న  మాధవీ లతను చూసిన
పంచ బాణుడు చెరకు విల్లు సవరింప
పండితుల పంచాంగ శ్రవణాలతో
కవి వరుల కవి సమ్మేళనాలతో
శుభాల నందించిన శుభ కృత్ తరలి వెడుతుంటే
జనజీవితాలను శోభాయం చేయాలని
ఆగమించే శోభ కృత్ కు
ఆనంద భైరవి రాగాలతో స్వాగతం పలుకుదాం.

10-శ్రీమతి తుమ్మల స్నిగ్ధ మాధవి –విజయవాడ -6305871095

ఉత్సవం
భగవత్ స్వరూపమై వికసించిన కాలం –జీవన గమనానికి నాంది
చంద్ర చకోరియై ఆమని పల్లవించి
పదనిస లాల పించే విశిష్టమైన పర్వదినం –ఉగాదియై నిలిచి
వసంతాన విరబూసిన  అమూల్య నవ నవో న్వేషణ పర్వదినం.
మధురానంద సందోహ కోలాహలం
మాధవ వేణు గానమై పరవశింపజేసే కాలం
మార్గమై ,విశిష్టత నంద సృష్టికి బీజమైన వేళ
చైత్రం హరి విల్లైపురివిప్పిన మయూరి కేళితో
రంగుల విస్ఫోటనమై –ప్రపంచాన వెలసిందీసుదినం.
కట్టుబాట్లెరుగని కుహూ నాదం ప్రణవ నాదమై
సర్వ జగత్తును కొత్త వత్సరానికి ఆహ్వానించింది
సృష్టి ప్రారంభానికి తొలితారకమంత్రమై
విలసిల్లింది శోభ కృత్
శుభకరమై శుభయోగమై
జగతి ప్రశాంతమై పరిఢ విల్లాలని ఆశిద్దాం  .

# నేటి ఉగాది

ఆంధ్ర బాషా భూషణ డా .టేకుమళ్ళ వెంకటప్పయ్య –నెల్లూరు -9490400858

నేటి ఉగాది

1-ఉ-కోకిల కూతలేవి యిట ?కూల్చిన మానులే ఎల్ల తావులన్ –
సోకిన రేడియేషను కు చూడగ లేమిక పక్షిజాతులన్



పాకలు కూలిపోయినవి ,పాడియు పంటయు గాన రావయా –
మాకిక పండు గేమిటని మానె జనాళి సంప్రదాయముల్ .

2-చేరి ఉగాది పచ్చడిని చేయుట రాక దుకాణ మందునన్ –
కోరిన రీతిగా కొనగ కోరిక దీరగ  నేటి కాలమున్
గారెలు బూరెలున్ దొరకు ,కాంతలకిప్పుడు చింతలేదయా –
మారెను లోక మంత యను మాన్యుల మాటలు నిక్కమాయెగా.

3-శోభల బెంచు కాలమున సోదర బావము నెల్ల వేళలన్ –
లాభము గోరకుండమరి లౌక్యము లోడను జీవనమ్ములన్
శంభుడు దీర్చు బాధలను సవ్యము నందవే సర్వ క్లేశముల్ –
శోభిత భావముల్ బెరుగ సౌభగ మబ్బదెదైవ లీలచే .

4-చింతలు మాని కార్యములు సిద్ధము జేయుడు  వేగమై చనన్ –
ద్యోతల్ మై వెలుంగుగద దూరపు కొండలు నిన్ను జేరుటన్
నేతల నెన్ను వేళలను  నిద్దురబోయిన సర్వ నాశమే –
పాతక మందగా వలదు పట్టకు నోట్లను ఎన్ను వేళనన్ .

# నవనాయకులకు స్వాగతం

శ్రీ మైనేపల్లి సుబ్రహ్మణ్యం –ఆకునూరు-9290995112

నవనాయకులకు స్వాగతం

శోభ కృత్ లొ నవనాయకులలో ఎనిమిది మందిశుభులు
అందరూ ఇస్తారు శుభ ఫలితాలు –శని ఒక్కడే ఇబ్బంది పెడతాడు
పెత్తందార్లమాట గోచికిచాలదు –శత్రుదేశాలకు అహంకారమెక్కువే
రవికుజులకు పెత్తనం హుళక్కి –ముందు చూపులేని వారు మూలుగుదురట.
జాగ్రలోం జాగ్రత జాగ్రత జాగ్రత .

# శోభ కృతి

విశిష్టకవి దా బందా వెంకటరామారావు –విజయవాడ -6281754709

శోభ కృతి

సర్వ శుభముల ఆకృతి శుభ కృతి –ఆశుభాల శోభల స్వీకృతి శోభ కృతి
శుభముల శోభలకు స్వాగతమంటున్నా - గతమున మించిన ప్రగతిని కోరుకొంటున్నా .



వత్సరమేదైనా వాంఛలు కొన్నే అవే-ఆరోగ్యం ఆదాయం బాగుండి పెరగాలని
అందరూ బాగుండాలి అందులో నేనుండాలి –కలలు పండి కోర్కెలు తీరాలని
పంచాంగాలు చినిగినా ఇదే మానవ నైజం –రాశిఫలాలు కంటికి కనపడినా ఏదో ఆశ
శుభకర శోభ తిలకించేందుకు అహోరాత్రాలు ఎదురు చూపు
షడ్రుచుల పచ్చడి మామూలే అయినా ఎదురు చూసి తినడం మహదానందమే .
ఇదే ఉగాది వేదనల త్రికాల వేదం – అలుపెరుగని ఈ బందా నాదం .

# స్వాగతం శోభకృత్

సింహాద్రి వాణి, విజయవాడ, 7569820872

స్వాగతం శోభకృత్

ప్రక్రియ:-- పద్యం



ఉ.మా. స్వాగత మమ్మ నీకు కడుసాదర పూర్వక , శోభకృత్ భళా
రాగల వత్సరమ్మ, భువి రాల్చుము కల్మష మీర్ష్య ద్వేషముల్
సాగగ నీతి న్యాయముల సవ్యపు బాటను నెల్లవేళలన్
రోగములన్ని గూల్చి, ప్రజ రోయగ జేయుము స్వార్థ భావనల్

2) ఉ.మా. ఏదినమందునైన జనులెల్లరు సౌఖ్యము పొందు రీతిగా
యాదినముల్ యుగాది ప్రజ కాదర మొప్పగ నీయగావలెన్
నాది యనల్ప భావనను, నైచ్యపుటూహలు కూల్చివేయ, రా

వా,దిశలన్నియున్ వెలుగు వాగులు పొంగగ లోకమందునన్.

3) సీ. ఈర్ష్య క్రోధములను నిలపైన బాయగా
కనువిప్పు కలిగించు కలుష ప్రజకు
ప్రేమానురాగాలు పెంపొంద జేయుమా
కులమత భేదాలు కూల్చివేసి,
మోసాలు కుట్రలు మొదలంట తొలగించి
మనుషులు మనసున మమత పెంచు
చదువు జ్ఞానములిచ్చి చల్లగా కాపాడు
పెడదారి పోకుండ పిల్లలెపుడు



ఆ.వె. కష్ట సుఖములందు కలిగి సంయమనమ్ము
సాగిపోవగ ప్రజ స్థైర్యమిడుము
శాంతి సౌఖ్యములిచ్చి చల్లగా దీవించు
దినము దినము గడువ దివ్యముగను

5)ఆ.వె. యువత భవిత గూల్చు వివిధ దారులు మూసి
చదువు వైపు శ్రద్ధ చాల గూర్చు
విజ్ఞత కడు పెంచు విజ్ఞాన మును నిచ్చి
దేశ భవిత వెలుగు నాశ నింపు

# తన్మయత్వమొందవచ్చు

శ్రీ మేడిశెట్టి యోగేశ్వరరావు, మచిలీపట్నం, 9490168715

తన్మయత్వమొందవచ్చు

సరసభారతి వారి ఉగాది కవితల సంకలనం కొరకు

..........................

శుభకృతును పంపవచ్చు
శోభకృతుని పిలువవచ్చు..

అనుభవాలు చెప్పవచ్చు
అనుభూతులు పొందవచ్చు

పేరొక్కటి మారుతుంది
పంచాంగం మారుతుంది
తీరు ఎపుడు మారలేదు
తెలుగుదనం కొదువ లేదు..

మామిడిపుడు పూస్తుంది
కోయిలిపుడు కూస్తుంది..
చైత్రమాస మిపుడిపుడె
సొగసులద్దుకుంటుంది

మామిడాకు తోరణాలు
ముదముతోటి కట్టవచ్చు..
వేపపువ్వు కోయవచ్చు..
ఉగాదని చెప్పవచ్చు...




కవితలెన్నొ రాయవచ్చు
కోరి కోరి పంపవచ్చు
సన్మాన పత్రాలతో
సంతసంబు చెందవచ్చు..

పంచె కట్టు చూడవచ్చు
పంచాంగం వినవచ్చు..
రాజ పూజ్యాలనన్ని
లెక్క గట్టి ఉంచ వచ్చు..

ఉప్పు తీపు పులుపు చేదు
కారమింక వగరులంటు..
షడ్రుచుల ముచ్చటంటు
సరిపాళ్లలొ కుదిరెనంటు..
జీవితాని కర్థమంటు
పచ్చడింత పెట్టవచ్చు..

సందడెంతో చూడవచ్చు
సంబరాలు చేయవచ్చు..

తెలుగుతనం తలనిమిరితే
తన్మయత్వమందవచ్చు...
అందుకే
శీఘ్రముగ రావమ్మా...
శోభకృతు వత్సరమా....

# శోభకృద్వర్షమా!

## శోభకృద్వర్షమా!

సరసకవిరాజు,
విద్వాన్ నవులూరి రమేశుబాబు,
ఎం.ఏ.,ఎం.ఫిల్.
ఉయ్యూరు.

–

శ్రీమత్శోభకృదాఖ్యవత్సర శుభాశీర్వాద సంప్రాప్తతన్,
ప్రామాణ్యైక నిబద్ధనిత్య నికషా ప్రాబల్య మింపాఱగా,
ధీమంతోజ్జ్వల దివ్యతంత్ర ప్రభలన్ దేదీప్యమానంబుగా
సీమాంతావృత శోభలం దనరుచున్ సీమాంధ్ర వెల్గొందుతన్ 1.



అందంబౌ సుకుమార పత్ర సొగ సల్లాడించు వృక్షంబులున్,
యెందెందున్ విననట్టి శ్రావ్యసుఖమెంతేనిచ్చుచున్ గోకిలల్,
సౌందర్యార్ద్ర విశీర్ణ నింబతరులున్ సౌగంధ పుష్పాలతో,
విందున్ గూర్చగ వత్సరాది! యదిగో వేంచేసె శోభాత్మయై. 2.

సాదరసానుకూల మనసందరకున్ గలగంగ జేయుచున్,
సోదర సౌహృదమ్ము, సరసోన్నతముత్తమ గ్రంధిబంధమున్,
సాదుజనాంచితాత్మకము సత్యము నిత్యమునైన మేళు, లి
పాదున పాతినంతన నపార ఫలంబిడు 'శోభకృత్తు' గాన్ 3.

అందరికి 'కరోన' హానిని జేకూర్చ,
శుభముగూర్చి జనియె 'శుభకృత్తు',
ఇంక నెక్కువగను, యెల్లజనులకును,
శోభ గూర్చ వచ్చె శోభకృత్తు! 4.

కష్ట సుఖము లానంద దుఃఖములకెల్ల,
కారణము తీపిచేదులు కారముప్పు,
లనెడి వేదమ్ము నెఱుగుచు నందరున్న,
ఆయురారోగ్య శోభల నందుకొనుము! 5.

## ఉగాది కాంక్ష

డా,ఓలేటి ఉమాసరస్వతి మచిలీపట్నం
9866366457

ఉగాది కాంక్ష

||కొత్త వత్సర మందు క్రొంగొత్త కోరికల్
తీర్చు నెడల కామధేనువగుత
కొత్త వత్సరమిల కూర్మినికూర్చుచు
జనులను నడుపుత చక్కగాను!
కొత్త మావిచిగురు కొసరిమేసినయట్టి
కోయిల శుభగీతి కూయుగాక!
శుభముల నొసగా శోభకృద్భువికిని
కాలచక్ర రథాన కదలి రాగ

||కష్టముల వెనుక సుఖము కల్గునట్లు
శిశిరమును దాటి చైత్రము చిగురు వేయు
నూత్న వత్సరమటులనె నూతనముగ
శాంతినిమ్ముత జనులకు క్రాంతిదొలగ



||పోగొట్టి రణభీతి, బొండుమ ల్లెల్విచ్చు
శాంతిపో డుములిడ సాగిరమ్మ
పసిమొగ్గను చిదుపు కసిచూపు లకనులు
పేలి కలియవలెన్  ధూళియందు
ఒజ్జల గౌరవం బొక్కింతయు కాపాడి
విద్య నేర్పునటుల వివరమిడుమ
చదవిన చదువులు సార్థక మగురీతి
జీవన భృతికల్గ జేయుమమ్మ

||కష్ట కాలము తొలగించి తుష్టికూర్చ
శుభము వెనుకనె వచ్చెడు శోభనంబు
నూత్న వత్సర మాంధ్రుల నోము ఫలము
శోభకూర్చుత శుభముల కాంతి తోడ!

||అంత మొందించి అబలపై ఆగడాలు
బడుగు జీవుల బ్రతుకులబాధలూడ్చ
జగతి నందనవనమట్లు చక్కజేసి
ఆయురారోగ్య భాగ్యము లమరు గాత!

# ఉగాది కవిత

పామర్రు వృద్ధాశ్రమం నుంచి శ్రీమతి ఎంబిటి సుందరి

# వార్తాపత్రికల వార్తలు

7 లీడర్ విశాఖపట్నం శనివారం, మార్చి 25, 2023

**లీడర్** దినపత్రికలో డాక్టర్ డి.వి. సూర్యారావు సారథ్యంలో.. ఇక నుంచి ప్రతి శనివారం **రైటర్స్ అకాడమీ** ఆధ్వర్యంలో లీడర్ సాహిత్య ప్రత్యేక పేజీని అందుకోగలరు. మీమీ రచనలు ఈ దిగువ ఈ-మెయిల్‌కు పంపగలరు.
Mail ID : writersacademy2012@gmail.com
- డాక్టర్ డి.వి.సూర్యారావు 9885188431

## హరికథను జాతి సంపద చేసిన ఘనుడు కోట

**(కోట సచ్చిదానంద శాస్త్రి పద్మశ్రీ అవార్డు స్వీకరించిన సందర్భంగా ప్రత్యేక వ్యాసం..)**

"సినిమా పాటలు బాణీలు హరికథలో భాగం చేసి చెప్పేవాడు వీడు హరికథకుడా " అని ఆనాటి పోటీదారుల విమర్శలను త్రోసిరాజంటూ "సంగీత విద్యను, పాండిత్యాన్ని పొంది గొప్ప హరికథా భాగవతార్‌గా విఖ్యాతులై 20,000లకు ప్రదర్శనలకు పైగానిచ్చి పండితుల ప్రశంసా పూర్వకమైన తల పంకింపును, దానిలోనే రాణించవచ్చేమో నన్న ఆలోచన వచ్చి అనతి కాలంలోనే దాన్ని సాకారంచేసుకున్నాడు. అపద్దతిగా హరికథా గానం చేస్తున్నాడని, దీనికి తగదని ఆ కళారూపాన్ని పెడదారి పట్టిస్తున్నాడన్న ఆనాటి తోటి కళాకారుల వెటకారాన్ని మనసులో పెట్టుకుని సంగీత విద్యను, పాండిత్యాన్ని పొంది గొప్ప హరికథా భాగవతార్ గా విఖ్యాతులై అనేక ప్రదర్శనలిచ్చారు. రేడియోలో ఎ గ్రేడ్ గుర్తింపు పొంది ఎన్నో హరికథలను రేడియో మాధ్యమం ద్వారా ఆంధ్రదేశంలో మారుమూల గ్రామాల ప్రజలకు వినిపించారు. అసంఖ్యాక శ్రోతలను పులకింపచేశారు. పండితుల ప్రశంసను పొంది, పామరులను సమ్మోహనపరచే స్థాయికి చేరుకున్న ఆ కుర్రవాడే ఆ అద్భుత కళాకారుడే... వెరసి శ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి.

**చరిత్ర**

హరికథ అన్నది భారతీయ సంప్రదాయ కళారూపం. .తెలుగువారి కెంతో ప్రీతిపాత్రమైనది. మతపరమైన భక్తి కథలు, ప్రధానంగా హరిలీలలను చెప్పే అనేక కళల సమాహారం. సంగీత, సాహిత్య, నృత్య, ఆంగి కాభినయ సంగమమే హరికథ. నారదుడు మహరుషుల ఆశ్రమాలలో, రాజుల, చక్రవర్తుల ఆస్థానాలలో శ్రీహరి కథలను చెపుతూ వారి మనసులను రసప్లావితం చేసే వారని పురాణాలు, ఇతిహాసాలు చెపుతున్నాయి. తరువాత గజ్జెలు, పట్టు దోవతి పంచకట్టు ,నడుముకు పట్టు కండువా చుట్టు, మెడలో ఒక పూలహారం ధరించి, తిలకం కనుబొమ్మల మధ్య నుండి ఫాలభాగం పైకి బారుగా దిద్ది ప్రేక్షక శ్రోతల ముందు నిలబడి ఆశువుగా, అద్భుతంగా చెప్పేవాడు.. ప్రధానంగా రామాయణం, భారతం, భాగవతం మొదలైన అధ్యాత్మిక సంబంధమైన కథలను విరివిగా చెపుతూ వుంటారు. తరవాత్తరువాత దేశభక్తుల, యోగుల, సంగీత విద్యాంసుల చరిత్ర లను అద్భుతంగా చెప్పి శ్రోతలను పరవశింప చేసేవారు. హరికథా గానమూలం సామవేదమని జమ్ములమడక మాధవశర్మ గారి భావన. ఆదిభట్ల నారాయణదాసు - ఆస్తిక్యమును, ధర్మాధర్మములను, సర్వజనమనోరంజనముగ నృత్యగీత వాద్యములతో నుపన్యసించుట హరికథ యనతగును అన్నారు.

శ్రీ కోట పురాణాలు, ఇతిహాసాలు, పండితులు చెప్పిన హరి కథకుల ఆహార్యాన్ని, ఆదిభట్ల వారి కథ చెప్పిన తీరును కరతలా మలకం చేసుకున్నారు. శ్రీ ముసునూరి నారాయణ మూర్తికి శిష్యుడయ్యారు. కఠోర సాధనచేసారు. సంగీత జ్ఞానాన్ని పొందారు. రామాయణ, భారత, భాగవతాలను చదివి ఆకళింపు చేసుకున్నారు. వాక్ శుద్ధిని సాధించారు.తను చేరవలసిన గమ్యపు మార్గంలోలో ఉన్న ఉన్న తన దారిద్ర్యం,కువిమర్శ,

22వ తేది ఉగాది పర్వదినాన ఢిల్లీలో భారత రాష్ట్రపతి శ్రీమతి ద్రౌపది ముర్ము చేతుల మీదుగా పద్మశ్రీ పురస్కారం అందుకున్నారు. ఆ క్షణాన వారి మదిలో ఎంత ఉవ్వెత్తున ఆనందంతరంగాలు ఎగసిపడి ఉంటాయో!

**ఎంతటి ఉద్విగ్న స్థితి!! ఎంతటి పారవశ్యం!!!**

ఈనాటికి కదా హరికథాప్రక్రియకు పట్టాభిషేకం జరిగిందన్న భావనతో శాస్త్రి గారి మనసు పులకాంకితమై తన గురువును, తల్లిదండ్రులను ఆదిభట్ల వారిని తప్పక స్మరించుకుని ఉంటారు. ప్రతి తెలుగువారు, తెలుగు జాతి భాష కందని అనుభూతికి లోనయ్యేది. ఆనందపరవశలయ్యేది.

శృంగేరి, శ్రీ కుర్తాళం పీఠాధిపతుల సమక్షంలో హరి కథా గానం చేసి వారి అనందాన్ని అనుగ్రహాశీస్సులుగా పొందటం తనకు దక్కిన మహాభాగ్యమని అంటారు శ్రీ కోట.

మహరథి కర్ణ హరి కథ శాస్త్రి గారి పేటెంటు. శల్యుని

విద్యాగంధం లేని సామాన్యులను తన కథాగానంతో సమ్మోహనపరచిన ఆ అద్భుత కళాకారుడే శ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి. భారత ప్రభుత్వం 2023 సంవత్సరానికి వారికిపద్మశ్రీ పురస్కారం ఇవ్వటం హరికథకు తక్కిన అపురూప గౌరవం. అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు గారికి గౌరవం.హరికథా కళకు ప్రభుత్వం ఇచ్చిన గుర్తింపు. ఇది గొప్ప గొప్ప హరికథకులకు దక్కినదిగా భావిస్తున్నాను అన్నారు శాస్త్రి గారు వినమ్రుడవుతూ ఆ అత్యున్నత పురస్కారం నేటికి వారి ఎనభై తొమ్మిదివ ఏట వరించింది. వారు చేపట్టి చెప్పిన హరికథల వయస్సు వయస్సు డెబ్బై ఏడు. బాపట్ల జిల్లా అద్దంకి గ్రామంలో 1934 లో ఆగస్టు 12వ తేదీన జన్మించిన శాస్త్రి గారు చదివింది మూడవ తరగతి మాత్రమే. తండ్రి చెప్పిన కొంత వైదిక విద్య, నమక చమకాలు, కొంత సినిమా పాటల పరిజ్ఞానం మాత్రమే ఆచిన్న కుర్రవాడికి పట్టుబడిన విద్య. మహాభారత కథలను సందర్భం దొరికినప్పుడల్లా వినసొంపుగా చెపుతూ శ్రోతల మెప్పు పొందుతుండే వాడు. ఆ తండ్రి ఏనాడు తన పుత్రుడి ప్రదర్శన చూసిన దాఖలాలు లేవు. కానీ అప్పుడప్పుడు మధ్యలో ఆపేస్తావేం. పూర్తిగా చెప్పలేవా అని కొడుకు మీద కోపాన్ని చూపేవారు. దీనినిబట్టి తను చెప్పిన కథలను కొన్నైనా తండ్రి విని ఉంటారని బోధపడిందా ఆ పిల్లవాడికి. అప్పటికి ఆ కుర్రవాడికి పద్నాలుగు వత్సరాలు దాట లేదు. అనూహ్యంగా తండ్రి మరణించాడు. పెద్ద సంసారాన్ని పోషించవలసిన బాధ్యత అతని తలపై పడింది. మన జీవన గమనంలో కావలసిన తెగువ,మనోధైర్యం,స్థైర్యం మనకు అవసరాలే ఇస్తాయి అంటే అప్పటి వరకు మనలో దాగిన్న ఆ శక్తులు ఒక్కొక్కటిగా బహిర్గతమవుతుంటాయి.ఆ పిల్లవాడు

తనకు తెలిసిన ఆ భారత కథలనే జనరంజకంగా చెపుతూ నాలుగు డబ్బులు ఆర్జిస్తూ, ఆ తల్లి ఆర్థిక చింతనను కొంతవరకైనా తీర్చసాగాడు. పొట్ట కూటి కోసం చేపట్టిన విద్యలో పట్టు తెచ్చుకుంటే

కలియుగంలో ఆదిభట్ల నారాయణ దాసు తన అద్భుత పాండిత్య ప్రతిభ కు సంగీతం, అనితర సాధ్యమైన" పంచముఖి "అన్న అంశాన్ని చేర్చి రాజుల చక్రవర్తుల సమక్షంలో ప్రదర్శించి ఎంతో డబ్బును గౌరవాన్ని, ఎనలేని కీర్తిని పొందారు. తన పదంతో హరి కథకు ఒక పథం వేసారు. ఎంతమందికో మార్గ దర్శకులై హరికథకులకు ప్రాతఃస్మరణీయులై, ఆరాధనీయుల య్యారు. వారి తరువాత ఎందరెందరో ఈ కళారూపాన్ని వృత్తి గా చేసుకుని జీవనం సాగించారు. కొందరు గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందారు. ప్రజల మనసుల్లో నిలిచి పోయారు.

సచ్చిదానంద శాస్త్రి గారికి ఆదిభట్లవారి ప్రతిభ గురించి వినటమే గాని చూసే అవకాశం అదృష్టం రాలేదు. అయితే ఆ హరి కథా పితామహుని హరి కథా గానరీతి మనస్సులో ప్రతిష్ఠించు కున్నారేమో లేక నర నరానా జీర్ణించుకున్నారేమో అన్నంతగా, శాస్త్రి గారు కథా గమనం ఉండేది. "మీ శైలి వారిది గుర్తుకు తెస్తోందని "అని శ్రోతలు శ్రీ కోట వారితో చెప్పిన సందర్భాలు అనేకం. హరికథకుడి బహు పాత్రాభినయం చేయవలసి ఉంటుంది. నవరస నటుడు, గాయకుడు, సాహిత్య ప్రేమికుడు ధార సందర్భ శుద్ధి, హాస్య చతురత, చమత్కారం.. వీటి మూర్తిమత్వమే హరి కథా భాగవతార్. ఇన్ని శక్తులను సొంతం చేసుకుని చేత నుండే చిరతలతను మోగిస్తూ, కాలి గజ్జల మువ్వలను ఒక లయ.. ఊగు.. తూగులతో మోగిస్తూ నయానందకర అంగికాభినయనంతో మనోరంజకంగా కథా గానం చేసే వాడే హరికథకుడు.

హరి కథకుడు ఒక విలక్షణరూపధారి. చేత చిరతలు, కాలి

తన పాండిత్యలేమి అనే కంటకాలను ఓర్పు, నేర్పు,పరిశ్రమ, శోధన, సాధనలనే సాధనాలతో తుత్తునియలు చేసుకుని తనకొక మార్గాన్నిచేసుకున్నారు. దాన్నిరాచమార్గం చేసుకునేందుకు అహరహం కష్టపడ్డారు. ఉన్నతస్థితికి చేరుకున్నారు. తన సమ కాలికులలో కొందరికి, యువ హరికథకులకు గొప్ప మార్గదర్శి అయ్యారు. కృషితో నాస్తి దుర్భిక్షం అన్న సామెతకు నిలువెత్తు నిదర్శనంగా నిలిచారు. ఈనెల తెలుగు వారి తొలి పండుగ

శ్రీకోట సచ్చిదానంద శాస్త్రి కళా కారుని కళా వైదుష్యం తో జాతి సంపద మరింతగా సుసంపన్న మైంది. ఇరవై వేలకి పైగా హరికథా ప్రదర్శన లిచ్చిన వారి డెబ్బై ఏళ్ల సుదీర్ఘ కళా ప్రయాణంలో ఎనలేని ప్రజాభిమానాన్ని సంపాదించారు. పండితుల ప్రశంసలు ఆమోదాన్ని పొందారు. తోటి హరికథ కులకు మార్గదర్శి అయ్యారు.హరికథా సప్తాహాలను సమర్థంగా నిర్వహించారు. ఇవన్నీ ఒక ఎత్తు. శ్రీ కంచి కామకోటి,

సూటిపోటి మాటలతో ఛిద్ర మైన కర్ణుడి హృదయావిష్కరణను, అర్జునిని తూణీరాలతో తూట్లు పడిన కర్ణుడి శారీరక స్థితిని మహరథి కర్ణలో వర్ణించి చెప్పే వేళ అశ్రువులు రాల్చని శ్రోతలూ ఉండే వారు కాదు..శ్రీకృష్ణ రాయబారం, నర్తనశాల, వంటి కథలతో పాటు శ్రీ రామకృష్ణ పరమహంస, సిద్ధేంద్ర యోగి కథలను చెప్పి శ్రోతల ఆనందాతిశయ కరతాళ ధ్వనులు పొందే వారు. శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, సరసభారతి అధ్యక్షులు ఈ నెల 19వ తేది ఉయ్యూరులో వారిని జీవన పురస్కారంతో గౌరవించి సత్కరించారు.

ఎనభై తొమ్మిళ్ల వయోభారాన్ని లెక్క చేయక అక్కడికి వెళ్లి ఆ సన్మానన్ని పొందారు.తమ మృదువైన స్వరంతో చక్కగా ప్రసంగించి ప్రేక్షకులను ఆశ్చర్యానందచకితులను చేసారు. గుంటూరులోని శ్రీ ఓంకార క్షేత్ర దేవాలయ ప్రాంగణం లో కోట హరికథా గానకళా పీఠం వారు, హరి కథా గాన కళా త్రిమూర్తుల ఆరాధనోత్సవాలు జరిపారు. ఆ సందర్భంలో ఒకనాటి సాయంకాల సభకు ప్రముఖ పద్య కవి శ్రీ రామడుగు వేంకటేశ్వర శర్మ ముఖ్య అతిథి గా ఉండి, ప్రసంగం చేసి,

"వేగంబాయన జీవ లక్షణము నిర్భీకోక్తి మత్ ధారణా
భోగంబా కడు చిత్రమా హరికథా భూయిష్ఠమా
కోటలో పాగా వేసిన పాత కాపు సుకళా భాగ్య ప్రభాకార సు
శ్రీ గర్వంబు యశంబు ఖర్వము
లసత్ శ్రీ సచ్చిదానందుడే

కోట సచ్చిదానందం గారిని పై పద్యంలో ప్రశంసించారు.

- బొడ్డపాటి చంద్రశేఖర్,
అంగ్లోపన్యాసకులు

## జ్ఞాపిక




## ధన్యవాదాలు

సరసభారతి 172వ కార్యక్రమంగా నిర్వహించిన శ్రీ శోభ కృత్ ఉగాది వేడుకలలో అతిధులుగా ,పురస్కార గ్రహీతలుగా ,కవిసమ్మేళన కవులుగా ,సాహిత్యాభిమానులుగా పాల్గొని , మా ఆతిధ్యాన్ని పురస్కారాలను స్వీకరించి సాహిత్యలోకాన్ని ఆనంద భరితులు చేసిన సాహితీ బంధువులకు,సరసభారతి కార్యవర్గ సభ్యులకు శ్రీ శోభకృత్ ఉగాది శుభా కాంక్షలతో ధన్యవాదాలు తెలియ జేస్తున్నాను –గబ్బిట దుర్గాప్రసాద్ -20-3-23— ఉయ్యూరు

# అంకితం

శోభక్రుత్ ఉగాది కానుకగా 19.03.2023 అందిస్తున్న మరొక అంకాత్మక (డిజిటల్) పుస్తకం. శ్రీ శోభ కృత్ ఉగాది 2023 19.03.2023 జరిగినమీద వివిధ రచయితలు రాసిన పుస్తకాలు చదివి అప్పటికప్పుడు సరసభారతి బ్లాగ్ లో రాసిన సమీక్ష సమాహారం. శ్రీ శంకర

మంచిమనసు, మహా నిజాయితీ, గొప్ప ఆత్మీయత, చక్కని హాస్యప్రియత్వం ఉన్న అల్లుడు **శ్రీ వేలూరి రామకృష్ణ** కు శ్రీ శంకర డిజిటల్ పుస్తకం అంకితం



https://ia802602.us.archive.org/15/items/20230327_20230327_0904/%E0%B0%B6%E0%B1%8D%E0%B0%B0%E0%B1%80%20%E0%B0%B6%E0%B0%82%E0%B0%95%E0%B0%B0.pdf

# రచనలు

## ముద్రిత రచనలు

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన ,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో .క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రచురణ | అంకితం | పేజిలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవీణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 116 |
| 3 | దర్శనీయ దైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 164 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 159 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహత్యం, కథలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 120 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 120 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 184 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 632 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా\|\| భండారు రాధాకృష్ణ మూర్తి , సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కెమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 144 |
| 15 | దైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్చ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 80 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 17 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంథం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుద్భా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం ,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి , సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |
| 23 | ఆధునిక ఆంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 168 |
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజి.లాల్యే ఇంగ్లీష్ "మల్లినాథ'అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 120 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 80 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

సంపాదకత్వం

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య "హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే"రెడీలు' | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతారావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుధైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ స్రవంతి | (సాహితీ మండలి తరఫున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు

| | పుస్తకం పేరు | వివరాలు | విడుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు | Emeritus of South Asian Studies at the University of Visconsin, Madison లో Professor Da vid.M.Knipe Vedic Voices-intimate Narratives of a Living Andhra Tradition కి అనువాదం | 19-04-2019 | 67 |
| 2 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 3 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |
| 4 | దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| 5 | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి సాహిత్య, సామాజిక సేవ వార్తాపత్రికల సంకలనం 132 వ జయంతి కానుక | 15-08-2022 | 45 |
| 6 | శమీ అష్టోత్తరం పూజా విధానము | శమీ అష్టోత్తరం పూజా విధానము | 05-10-2022 | 15 |
| 7 | సహస్రచంద్రదర్శనం | సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం | 05-10-2022 | 60 |
| 8 | శ్రీ శంకర | ఆది శంకరాచార్యుల బోధనలు | 22.03.2023 | 200 |
| 9 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 కవితా సంకలనం | 14-05-2023 | 50 |

